Regd No N.44
M. 3813.

10343

విడిప్రతిక ౦-౧-౦

To Let

# గోలకొండ పత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు అర్ధవార జాతీయ పత్రిక

సంపుటము ౧౮ ❀ హైదరాబాదు దక్కన్ శా. శ. ౧౮౬౬ తారణ సం. చైత్ర శు. ౬ [ ౩౦-౩-౧౯౪౪ ] గురువారము ❀ సంచిక ౨౮



# మణిపూర్ రాష్ట్రంలోనికి జపానువారి ప్రవేశము

## జపాను వారికి గొప్ప నష్టాలు

### శత్రువులతో తీవ్ర ప్రతిఘటన

ఈ యుద్ధములో భారతీయభూమిపై జపాను వారు యుద్ధముచేయుటకిదే మొదటిపర్యాయము యుద్ధశాఖవారి ఒక ప్రకటనవల్ల, మణిపూరు రాష్ట్ర సరిహద్దులను దాటి జపానుసైన్యాలు కొన్ని ప్రదేశాలలో ముందుకువచ్చినవి. నీరు ౧౬౦ మైళ్ళ పొడుగు టుంగపూర్ రోడ్డువెంబడి తమదాడి నడుపుచున్నారు. ఈ రంగములో ప్రథమశ్రేణిలోయున్న సైన్యాలు వారినెదుర్కొనుచున్నవని మార్చి ౨౦ నాటి వార్తలనుబట్టి తెలియుచున్నది. తరువాత వార్తలనుబట్టి చిన్‌కొండలకు దక్షిణభాగములో మనసైనికదళాలు హాకాఅనే ప్రదేశంలోయున్న జపానుదళాలపైబడి వారినితరిమివేసి టిడ్డిం ఇంఫాల్‌కు మధ్యనున్నరోడ్డుపై రెండుగుట్టలు స్వాధీనపర్చుకొనిరి. యిచ్చటిపోరాటములో శత్రువులు కొంత ఆయుధసామానులనువదలిపారిపోయిరి. యుక్రూ శత్రుప్రాంతములోను రిమోకశత్రుదాడిజరిగినది. శత్రువులు ముందుకుసాగుచున్నారు. గాని గొప్పనష్టములు గలిగినవి. జపాను సైన్యాలు టిడ్డిం నుండి ఉత్తరదిశగా ప్రయాణంసాగించుచు టాంకులతో యుద్ధము చేయుచున్నవి. వారి టాంకులు చాలా ధ్వంసము చేయబడినవి.

అరకాన్ రంగములో పర్యవేక్షక సైన్యాలు తీవ్రంగా పనిసాగించుచున్నవి. ౨౫ మార్చి నాడు మనసైన్యాలు ఒకగుట్టనుండి శత్రువులను పారద్రోలినవి. సోంగ్రాకొండలవద్ద జపానువారు ఖోవిందియావైపు పురోగమనము సాగించుచున్నారు.

#### కాక్సుబజారుపై దాడి

మార్చి ౩౪ తేదినాటి ఉదయము కొన్ని జపాను విమానాలు కాక్సుబజారు విమానాశ్రయముపై దాడి సలిపినవి. పెద్దవస్తు సముదాయానికి పెద్దనష్టమేమియు జరుగలేదు గాని, చాలామంది సైనికోద్యోగులు, ప్రజలు చనిపోయిరి.

#### పసిఫిక్ రంగం

మిత్రమండలివారి పసిఫిక్ ప్రధానకార్యాలయ ప్రకటన ఒకటియిట్లు తెలుపుచున్నది. టోరోకీనియా, బోగెన్‌విల్లి ప్రదేశాలలోయున్న అమెరికాసైన్యాలను పారద్రోలుటకై జపానువారు ౨౦౦౦మంది సైన్యముతో తిరుగుదాడులను సలిపిరి. యీ పోరాటములో ౩౦౦ మంది జపానీయులు మరణించిరి. అమెరికనులు నలుగురుమాత్రమే మరణించిరి. దీనిఫలితముగా రెండు దీవులు అమెరికా వారి వశమయ్యెను.

#### క్యాసినో యుద్ధం

క్యాసినోనుండి జర్మనులు మొదట వెళ్ళగొట్టబడినప్పటికీ, వారు క్రమముగా పట్టణములోని కొన్ని భాగాలను వశపరచుకొన్నారు. క్యాసినో పట్టణము పురాతనకాలంనుండి రక్షణకార్యాలకు పేరుపొంది యున్నది. ఇచట రక్షణ అనుకూలాలు చాలా యున్నవి. ఈ అనుకూలములను ఉపయోగించుకొంటూ జర్మనులు ఎదురుదాడులు సలుప యత్నించుచున్నారు.వీరికియిక్కడఅపారమైననష్టములు కలుగుచున్నవి. పట్టుబిగువుకు మాత్రమే పోరాడుచు నష్టపడుట తెలిసికొన్నవ.

#### అక్షరాజ్యసైన్యాలు క్రిమియా నుండి ఖాళీ

ఇస్తాంబుల్‌నుండి వచ్చిన నమ్మకమైనవార్త ననుబట్టి అక్షరాజ్యాలసైన్యాలు క్రిమియాను ఖాళీచేసి వెళ్ళుచున్నవని తెలియుచున్నది.

ఈమధ్య రుమేనియావారు కొంబలపు దళము మొదట ఒక పెద్ద స్టీమరులో నల్లసముద్రములో నుండి వచ్చుచుండగా, రష్యా జలాంతరామి కని పెట్టి దెబ్బతీసినది. తత్ఫలితంగా సైన్యమంతా నీటిపాలైనది, యీ వార్తను రుమేనియాప్రజలకు తెలియజేయక యుంచినారని తెలియుచున్నది,

#### రుమేనియా సరిహద్దు పోరాటము

రుమేనియా సరిహద్దులో బెస్సరేబియాయందున్న బాల్టి, ప్రాస్కూరావ్ అనే ముఖ్యమైన పదేశాలను జర్మనుసేనలువిడచి పారిపోయినవి. బాల్టిని రుమేనియాయందు జర్మనుల ప్రధానస్థానముగా ఏర్పాటుచేసుకొని యుండిరి ఇది అన్నివిధములా చాలా ముఖ్యపట్టణము. తరువాత రష్యనుదళములు మార్షల్ కోనేయి అధిపత్యములో ఒడెస్సాను, మరికొన్ని ప్రదేశాలను పట్టుకొని ప్రత్‌నది వరకు వచ్చినారు పీని పోకడనుబట్టి చూడగా ప్లొస్టినూనెగనులనువశపరచుకొనే యుద్దేశముతో పురోగమనము సాగిస్తున్నట్లు తెలుచున్నది. జర్మనుసైన్యాలు ధైర్యముచెడి పారిపోవుచున్నవి. రుమేనియానుఅటియూనెగనులనురక్షించుకొనవలెనంటే క్రొత్తసైన్యాలను తెప్పించుకొనవలసే గాని జర్మనులకు ఆశలేదు. ౨౫ మార్చి తేదినాటి సోవియట్ ప్రకటనలో, రష్యాసైన్యములు కెమనెట్సు పొడోల్స్కి ప్రదేశాలను యింకా కొన్ని గ్రామాలను గూడ పట్టుకొన్నారని తెలియుచున్నది.

#### ఎర్రసేనలు జెక్కు సరిహద్దు సమీపంలో

రష్యను సైన్యాలు సీస్టర్ నదికిరువైపులా పురోగమనము సాగించి, ౧౯౩౯ సంవత్సరమునకు పూర్వపు జెకోస్లోవాక్యా సరిహద్దును సమీపించినది. త్రోవలో టోర్న్యపోల ప్రాంతాలలో యున్న శత్రుశేషాలను తీసివేసుకుంటూకోలోమియా అనే ప్రదేశమువరకు వచ్చినవి. రష్యాయందలి యితర రంగాలలో విశేషాలేమీలేవు.

హంగేరీరంగములో జర్మనుల క్రొత్తసైన్యాలు ముందుకు సాగుచున్నవి. కాని యుగోస్లావ్ సైనికులు కొంతిమంది వారి నెదిరించుచున్నారు. కొన్ని చోట్ల జాన్సియా బల్లెపుదళాలు వారినాపి నష్టములు కలిగించినవి, ఈసమయములోనే హంగేరీకి యిదివరకు ప్రధానిగా యున్న నికోలస్ కాలీతప్పించుకొనిపోయి మిత్రమండలి వారితో చేరినాడట

#### జర్మనీని పిండికొట్టారు

మార్చి ౨౪వతేది రాత్రి సుమారు ౧౦౦౦ బ్రిటిషువిమానాలు జర్మనీయందలి ముఖ్య ప్రదేశాల మీద బాంబులవర్షించి, బెర్లిన్‌నగరాన్ని, పశ్చిమ జర్మనీయందున్న ముఖ్య పట్టణాలనుధ్వంసము చేసినవి. ఈ ప్రళయమైనదాడులలో జర్మనులకెంతనష్టమైనది భగవంతునికే ఎరుక గాని, మనవి మాత్రము ౭౩ విమానాలు నష్టమైనవని విమానశాఖవారి ప్రకటనవల్ల తెలియుచున్నది. ఈ దెబ్బ లకు హడలిపోయి ఫ్రాంక్‌ఫర్టును ఖాళీచేయుటకై జర్మనులు ప్రయత్నము చేయుచున్నారట.

#### లండన్‌పై భయంకర విమానదాడి

ఇంకవరకెన్నడు జరుగనంతటి భయంకరమైన విమానదాడి జర్మనులు ౨౪వ తేదినాటి రాత్రి లండన్ నగరముపై జరిపిరి. చాలాచోట్లనుండి నష్టము గలిగినవార్తలు వచ్చెను జర్మనులు ముందుగా ఒకరకమైన నూనెను పైనుండిచల్లి తరువాత అగ్నిబాంబులు వేసినందువల్ల చాలా ప్రదేశాలలో మంటలు చెలరేగినవి. మహాభీభత్సం జరిగింది.

---

#### శుభాగమనము

సీతారాంబాగ్ శ్రీ మదుభయ వేదాన్తవర్ధినీ సంస్కృత పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు శ్రీ ఉ. వే. బ్ర శ్రీమాన్ కో, కం. అ. శ్రీ శఠకోపం రామానుజాచార్య స్వామివారు వరంగల్లుకు రెండువారములనాడు వచ్చిరి. వీరికి స్థానిక పురప్రముఖులు స్వాగతమొసగి ఊరేగింపు సల్పిరి

వైదిక కళాశాలను దర్శించిరి. శ్రీ మాన్‌స్వామి వారు కళాశాలా సన్నివేశముతో గూడిన గురుకులమును జూచుటచే నామనయునకు మిక్కిలి యుత్సాహము కలుగుచున్నదనియు తాను విద్యార్థులకై కొన్ని నుపదేశములనిచ్చుటకై మరొకప్పుడైన కొంతయవకాశము తీసుకొందుననియు నీ కళాశాలపై పూర్ణాభిమానము గలిగినదనియు తెలిపిరి

#### అయ్యంగారి నియామకం

ఆదిలాబాదు నష్ప డిప్యుటీ కమిషనరుగా శ్రీ, రామస్వామిఅయ్యంగారు అనే వారిని హైదరాబాదు ప్రభుత్వమువారు నియమించినారు.

#### మహబూబాబాదు

౨౧-౬-౫౩

మహబూబాబాదు తాలూకా ఆంధ్రజన సంఘప్రతినిధులు ౧ ఖురుదాదు ౧౩౫౩ ఫ. బుధవారం సాయంత్రం ౫ గంటలకు మహబూబాబాదులో జరుగుచు, కావున ప్రాథమిక సభ్యులందు ఎన్నికలందు పాల్గొన కోరుచున్నాము, ఇట్లు
అప్పె వెంకటరామయ్య.

---

జనగాము తాలూకాలోని ఆస్నూరుఅందు విద్యాసంస్థల సభిమానములో జూ చు గారువారు శ్రీ రావాక వెంకటరామచంద్రారెడ్డిగారు తమకుమారు వివాహసందర్భములో విద్యాసంస్థలనన్మానించుచు, వరంగల్ వైదికకళాశాలకు రూ ౨౫ లు వి రాళ మొసగిరి.

#### క్రైస్తవులకు ప్రభుత్వంపై అపనమ్మకం

మద్రాసు, మార్చి ౨౬.

మద్రాసులోభారతీయ క్రైస్తవుల సమావేశ మొకటి నేడు శ్రీ)వి. చక్రయ్యచెట్టియార్ (పూర్వ ప్రమేయర్) గారి అధ్యక్షత సమావేశమై, భారతీయ క్రైస్తవులు జాతీయనాయకులగు గాంధీ, జవహర్‌లాల్, మొదలైనవారే దేశోద్ధారకులని నమ్మి వారినిజైళ్ళనుండి వెంటనే ముక్తులగావించి కేంద్రమునందు రాష్ట్రాలలోను జాతీయ ప్రభుత్వము నెలకొల్పవలెనని తీర్మానించిరి. మరియొక తీర్మానములో ప్రస్తుతమున్న కేంద్రప్రభుత్వములో భారతీయక్రైస్తవులకు ఏమాత్రమునమ్మకము లేదనియు, వారికిబాధ్యుడైన ప్రతినిధియొకరు ఆ ప్రభుత్వసభలో యుండునంతవరకు దక్షిణ భారతీయ క్రైస్తవులకు నమ్మకము కుదురజాలదనియు నిర్ణయించిరి,

---

#### బల్గేరి గా హిట్లరుకు లొంగింది

మాస్కోనుండి వచ్చిన రేడియోవార్తననుబట్టి బల్గేరియా ప్రభుత్వమువారు హిట్లరుయొక్క ఆజ్ఞప్రకారము బల్గేరియా సైన్యమునందు కొన్నిమార్పులుచేసినవి, రుమేనియాకు పంపుటకై ఒప్పుకొన్నది. బల్గేరియా సైన్యసహాయము వస్తున్నదని హిట్లరు రుమేనియాయందున్న సైన్యాధికారికి తెలియచేసారు.

---

